




Om

Sree

# Bhakta Samrakshaka Satakam.

*otherwise*

*Known as*

SUMANASOLLASAM.

*By*

GOPALUNI
HANUMANTA RAYA
SASTRY,
MUPPALLA,
VINUKONDA TALUK
GUNTUR DIST.

1924. *Price As.* 4.

ఓమ్.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

శ్రీ

# భక్తసంరక్షక శతకము.

ఇయ్యది

గోపాలుని హనుమంతరాయశాస్త్రి




గుంటూరు కన్యకా ముద్రాక్షరశాలయందు

పెంచేల చక్రపాణి సోదరులచే ముద్రితము.

మొదటి కూర్పు 250 ప్రతులు.

1924



[వెల రు. 0-4-0

(పోస్టేజి ప్రత్యేకము)

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# ఉపోద్ఘాతము

ఆర్యవరులారా ! పాఠక మహాశయులారా !!

ఈశతకము నించుమించు పదునెనిమిదివత్సరముల క్రితము మాతండ్రిగారియొద్ద నే నుపదేశమును బొందినతరిఁ గలిగిన నవీనభావోత్సాహావశమ్మునఁ బూర్తిజేసితి. అద్దాని నప్పుడే మదీయ బాల్యమిత్రులును శతావధానులునుఁ బ్రకృతము నైజాము రాష్ట్రమున శాసనపరిస్థితుల సంచారమ్మొనర్చుచుండిన ప్రముఖులును నగు శ్రీమాన్ శ్రీ శ్రీ శ్రీ మాడపాటి తిరుమల వేంకటరమణాచార్యులవారిచే సవరింపజేసికొంటినేగాని మరియెవ్వరికిని జూపింపనైతి. కారణము ప్రకృతయుగచర్యననుసరించి యేమహనీయుఁడో గాని తదితర సామాన్య కవిలోకమంతయు వారి నూతనపదములతోఁ దనుకడకువచ్చిన గ్రంథమ్ములఁబూరించి తీరవలయునను పట్టుదలగలవారయి యుందురను విషయము సత్కవిలోక మెరుంగనిదికాదు ఇంతయెగాక నొకరుచూచిన గ్రంథమును మరియొకరికిఁజూపింపనెంచి యేకవియేని తీసికొని వెడలినచో నసహనాపశాచగ్రస్తుడై యంతకుమున్ను సంస్కరించిన సవరణలను గొట్టివేసి యాయన స్వంతపదములతోఁ బూరించవలెనను పట్టుదలగలవాడై నానావిధముల గ్రంథమునపస్మారకముచేసి గ్రంథకర్తయొక్క ఉత్సాహమునుగూడ జెడగొట్ట బ్రయత్నించుచుండుటయు సర్వజనవిదితము. మరియు నాగ్రంథము నే వేరొకరికడకుగొనిచనినచో నాయన స్వకుచవర్గ నా సౌఖ్యమన్నటులఁ గొంతసేపు స్వభూషణపరదూషణలతోఁ గాలయాపనజేసి మరికొంతసేపు నానవేసి యుంచి పిలచినను బలుకక ఏనెలరోజులో ఏరెండునెలలో వాయిదావేసి అంతవరకీకవి సౌహోపికపట్టజాలక మరల మరల బరిశీలింపుడని బ్రతిమాలినచో "నామాటయేమిచెప్పతావు" అని చేయిజాచి దక్షిణలగోరుటయు నందులకును సహించియేదీనుడయినను సమర్పించనెంచినచో రేట్లననుసరించి దిద్దుబాటులు జరుగుచుండుటయు దలచు తటస్థించుట మనకన్నులయెదుట జరుగుచున్న చిత్రము. ఇంతియెగాక గ్రంథము బుధజనహృదయాహ్లాదముగ నుండునని యమ్మహామహునకుదోచినచో గ్రంథమును ధ్వంసము (బారవైచుట) నొనర్చుటయుఁగూడఁ బ్రకృతము జరుగుచున్న తాంత్రికమే? ఇవియన్నియు నాలోచించి యెవరి అంతరాత్మయే వారికి బంధువు అను భగవదుక్తి ననుసరించి నా హృదయమున కాఘనుడు (ఆచార్యులవారు) నిష్పక్షపాత బుద్ధిగల

వారలనితోఁచి వారికిమాత్రమే చూపించితి. కవులారా! నాయందీసుఁగొనకుఁడు. శేషంకోపేన పూరయేత్ అని నన్ను నిందింపకుఁడు. త్రికరణశుద్ధిగా మీయంతరాత్మల బురస్కరించుకొని యోజించుకొనినచో నివియన్నియు నిక్కములుగా మీకుదోఁచక మానవు. అందుచే వారియెడ నాకట్టినమ్మకము కలిగియే వారిచే సవరింపించితి ఇంత కాలమునుంచి నేనును నించుమించుగ నిరువదియారు గ్రంథముల రచించితి. ఈమధ్యననేక గ్రంథములు నావలన (నే ప్రతివిషయమునకు బద్ధుఁడనుగాక) బరిష్కరింపబడి ముద్రితములునయ్యె. ఐనను యీగ్రంథమును మాత్రము నేనుసవరించుటకుగాని మరియొకకవిచే సవరింపించుటకుగాని తలంచనైతి. కారణము పాకభేదమగుననియే; ఏగ్రంథమునందేని పాకభేదము కలిగనేని యరుచియగు, అరుచి యయిన వెంటనే యసహ్యముగదోఁచు. ఆతోడనే ముక్కువిరుపులు మూతిముడుపులు దటస్థించు. అంతగ్రంథముస్థానము నలంకరించు. అందుచే నేనా కార్యమునకు సాహసించజాలకపోయితి. మొదటినుంచియు యభిమతమిట్టిదియ. ఇంతమాత్రమున వారే మహాపండితులా యనిగాని నీవేమహాకవివాయనిగాని మామీఁద నంకెలువైవకుఁడు. నాయంతరాత్మయే పండితుని కడకరుగుమని యెప్పుడు ప్రేరేపించునో అప్పుడచ్చోటికిగాక తప్పదుగదా. అప్పుడైనను నాయంతరాత్మ ప్రేరేపించుటయు నేనువచ్చుటయు నొక్కరికడకేజుడీ; అన్యులయందుమాత్రమట్టి లక్ష్యమునాకేర్పడఁబోవదని నుండగా ప్రథముగ జెప్పగలుగుదును. అప్పుడు తమవంటి ప్రతిపండితుని కడకునువచ్చియేతీరుదు. తాము సవరించియే తీరుదురు. కావున నా యీగ్రంథమునందలి లోపములను అనుగ్రహించి తెలుపునెడ వందనపూర్వకముగ గ్రహించి ద్వితీయముద్రణమున సవరించుకొనెద.

ముప్పాళ్ళ
5—9—24.

ఇత్థం భవద్విధేయపరమాణుః,
గోపాలుని హనుమంతరాయ శాస్త్రి

---

శతావధానులును, విద్వత్కవులును అగు శ్రీమాన్, శ్రీ శ్రీ శ్రీ రూపాటి తిరుమల వేంకట రంగాచార్యులవారిటుల యభిప్రాయ మొసగిరి

క॥ అలరారు తేనెతేటలొ, పులకండపుమూటలో; అమోఘపు పథంబుల్,
దిలకింపజేయు బాటలొ, తెలియవు హనుమంతరాయ తీయనిమాటల్॥

ఇట్లు,
(శేషాద్రిరమణ కవులు, శతావధానులు)

ఓం శ్రీరామ

శ్రీ

# భక్తసంరక్షక శతకము.

శ్రీమద్వ్యాసశుకాదిమౌనిజనహృత్సీమాంతరాళోల్లస
ద్ధామా నిస్తుల నిర్వికార పరమాత్మా సచ్చిదానందరూ
పా మార్తాండసహస్రభాస త్రిజగద్వంద్యా పరాధీన యీ
శా మాయావ్యతిరేకభావయుత దీక్షా భక్తసంరక్షకా॥

శా॥ శ్రీమత్పండితసత్కవీంద్రవిబుధశ్రేణీడితానంతవి
ద్యామేధాపరిపూర్ణు నాశ్రితజనోత్సాహప్రదున్ మద్గురు
స్వామిన్ రామపదారవిందభజనాచాణక్యు గోపాల్ని శ్రీ
రామార్యున్ బిత్రు నెంతుఁ గోర్కె నెరవేరన్ భక్తసంరక్షకా॥

మ॥ పరమాద్వైతరహస్యభావవిదులన్ భావించి నిర్యాణత
త్పరతాసక్తుల సేవజేసి విపులాత్మానాత్మవిజ్ఞానులన్
గురిఁబూజించి కవీశులన్ బొగడి నిన్నున్ నేతగా నెంచి నే
డు రచింపన్ దొరకొంటి నీశతకమిట్లో భక్తసంరక్షకా॥

మ॥ కవితాలక్షణమా యెఱుంగఁ బ్రికటోద్గ్రంథమ్ములా [చూడ లే
దు విశేషమ్ముగ సంస్కృతాంధ్రముల యందున్ జ్ఞానమా [శూన్య మా
త్మవిచారమ్మున జిత్తమా చొరదు గ్రంథమ్మున్ లిఖింపంగ నె
క్కువ యాసక్తి జనించె డక్కోటుల నెట్లో భక్తసంరక్షకా॥

శా॥ దిక్కెట్టోయని యోచనన్ సలుప నే♦దీదిక్కు దిక్చక్రమే
దిక్కున్ గూర్చిభజించి మేల్ వడయునా♦దిక్కే సమస్తాత్మకున్
దిక్కౌగాక సహేతు భూతములకున్ ♦దిక్కింక వేరుండునే
తక్కంగల్గిన దిక్కులేమిటి కనం♦తా భక్తసంరక్షకా॥

శా॥ ఏనే బ్రహ్మమటంచు నెంచి మదిలో♦నీదృక్ప్రపంచంబున
జ్ఞానాంధోత్కర బాధురంబెయాని సం♦కల్పించి బ్రహ్మాది ని
ర్వాణోద్యద్గతమూలమే నిజమటం♦చాలోచనన్ సల్పియే
జ్ఞానందుండునో యాతడే పరముడ♦న్నా భక్తసంరక్షకా॥

శా॥ నీవే నేనని నేనె నీవయని సం♦దేహంబులేకుండ స
ద్భావాతీతమనస్కశాంతుజగదా♦ధారున్ సదానందు నిన్
ధీవీధిన్ నిలుపన్ బరంబనగ నెం♦తేదూరమా మోక్షల
క్ష్మీవైరాగ్యసుఖానుభోగపరమే♦ష్టి భక్తసంరక్షకా॥

మ॥ భువనాతీతుడవైననంబడక భూ♦ముల్ పర్వతంబుల్ సను
స్తవనంబుల్ జలధుల్ విశాలతరవృ♦క్షంబుల్ విచిత్రంబుగా
భవదీయంబగుఁ గుక్షిఁ దాల్చుకొని చె♦ప్పన్ వీలుగానట్టి మూ
ర్తివిధిన్ వెల్గెడునిన్ నుతింతుమదిఁ దం♦ద్రీ భక్తసంరక్షకా॥

శా॥ రాముండంచన శంభుడంచన మహా♦రాజాధిరాజంచనన్
సోముండంచన సూర్యుడంచన విరా♦ట్పూరుండనన్ శ్రీపరం
ధాముండంచన వేరెయెవ్వరోరు లం♦తన్ నీమహాత్యంబుగా
దా మోహాదివిరోధివర్గవిముఖా♦త్మా భక్తసంరక్షకా॥

మాయామానుషవిగ్రహుండు సకలా♦మ్నాయప్రభాభాసి స
త్యాయోషామణిహృన్నివాసకుడు ని♦త్యానందసంధాను డ

భక్తసంరక్షక శతకము.

న్యాయోపార్జిత కర్మదూరుడు మహాన్యాసాధికారుండు న
ధ్యేయుండక్షయుఁడంచు బిల్తు నినుఁ దండ్రీ భక్తసంరక్షకా॥

శా॥ నీలాంభోదసదృక్ప్రభాంగుడని సందీప్తాంబుజాతాభస
ల్లీలాత్ముండని పక్షివాహుడని యెంతే నిన్ను వాకొందు రీ
భూలోకమ్మున నుండు మానవులు మెప్పార్ గాంచఁ జిద్రూపమే
లీలన్ గాంతుర సన్నుతించుటకుఁ దండ్రీ భక్తసంరక్షకా॥

మ॥ ధరణీవ్యోమతలాంతరప్రకట సత్యస్తుత్య తేజస్వి సుం
దరమాయావరణానుభాసి విపులానందోపరబ్రహ్మమున్
స్థిరవాక్యమ్మున కాటపట్టైవడో ఆచిద్రూపి వివేకదా
అరయన్ శక్యమె నీమహాత్కళల నన్నా భక్తసంరక్షకా॥

మ॥ కలడంచారయువారికిన్ గలవు నిక్కంబౌన లేడంచు సం
చలవృత్తిన్ దిరుగాడువారికిచటన్ సాధించినన్ లేవు ని
ర్మలనీరేజరజోసుగంధమిల సారంగంపు సామ్మాను గా
కలవిన్ గప్పుకుజెందునే ప్రథితదీక్షా భక్తసంరక్షకా॥

శా॥ పప్పుల్ శాకములూరుబచ్చడులు నంబళ్లావలట్లప్పడాల్
మెప్పుల్ గుల్కెడి యావడాల్ ఘృతములున్ మీగళ్లుఁ
[బాల్ పెర్గులున్
దొప్పుల్ దొప్పలు తేనె చారు మరియున్ దోరంపు
[శాల్యన్నమున్
ముప్పుల్ గానక మెక్కువార్ని నెటు గంమర్ భక్తసంరక్షకా॥

ప్రణవంబాది సమస్తభూస్థలియు సర్వాంఖల్విదంబ్రహ్మ యం
చనివాపోమెడిసూక్తిపద్ధతిని బ్రహ్మానందభావంబె గా

వున నాయర్థమెఱుఁగలేక నెవరో బోధింపగా నెంతు రిం
తని చెప్పందగు వారిదర్భ్రిముల నీశా భక్తసంరక్షకా॥

శా॥ అంతర్బాహ్యములన్ సదాత్ముఁడజుఁడవ్యాహం
[కృతుం డాద్యుఁడ
త్యంతమ్మన్ వెలుఁగొందువాఁడొకఁడె కాఁడా? గుల్లలింగమ్ములి
ట్లంతల్ పొంతలు గాఁగఁ గూర్చుఁ బనియా నా సాధుచింతారత
స్వాంతుండై గురుభక్తుఁడైకొన లేవా! భక్తసంరక్షకా॥

మ॥ కనులన్ ముక్కును మూయనేమిటికి బింకాల్ గొట్టఁగా
[నేటి కా
యణుభూతుండని నిర్వికల్పుఁడని సత్యజ్ఞానుఁడై నట్టినిన్
గనుమార్గంబెఱుఁగంగ నెంచకయె చిక్కుండాతడం చెట్టులే
డ్చినసేమా? గుఱిలేని దేకొఱత తండ్రీ భక్తసంరక్షకా॥

పరిపూర్ణమ్మననేమొ? సత్పథమహాద్వైతమ్ము సత్యమ్ము శ్రీ
పరమార్థమ్ములనంగనేవియొ లసద్భావాత్మకవ్యష్టి రూ
పరమాస్యమ్మననేమొ సద్గురుపదాబ్జాతమ్ములన్ గొల్వకే
సరణిన్ గోచరమౌను దేబెలకు నీశా భక్తసంరక్షకా॥

మ॥ పిలువన్ బల్కకమాటలాడక మహాభీష్మాకృతిన్ దాల్చి హె
చ్చులకున్ బెత్తెడుసాగి క్రుంగి యటుపైఁ శుష్కించినట్లుండి వె
ఱ్ఱులకున్ వేయివిధమ్ములన్ననుడి నారూఢిన్ బ్రశంసింపనై
యిలటక్కుల్ పచరింప యోగియతఁడో నే భక్తసంరక్షకా॥

ఈ బ్రహ్మాండకటాహమందుమన నెంతే సూక్ష్మరూపంబుగా
నాబ్రహ్మాత్మకు డుండజేసెగద యాహా సర్వసామాన్యమా

నీబోధఁగనుండు సౌఖ్యమది వేరెచ్చోటనే నుండునే
దేబెల్ కొందరెఱుంగజాలరిది తండ్రీ భక్తసంరక్షకా॥

అవతారమ్ముల బెక్కుదాల్చితివి శూన్యాభాసివై కార్యముల్
సవిలాసమ్ముగ గోట్లొనర్చితివి లీలామానుషాకారివై
వివిధాఖ్యల్ వహియించియొప్పితివి సద్విద్యాత్కళారాశివై
యెవఁడేరీతినుతించఁగల్గునినుఁ దండ్రీ భక్తసంరక్షకా॥

మ॥ఎవఁడెచ్చోట నెలాటి కార్యమెపుడెట్టే యెంచినన్ గాని నీ
వవలీలన్ గ్రహియించి దానిఫలితంబవ్వానినందంగఁ జే
తువఖండాకృతివౌట సూదిచొర సందుర్లేక వెల్గొందు నీ
కవిలంఘ్యమ్మది యీధరాస్థలిని దేవా భక్తసంరక్షకా॥

మ॥పరమార్థంబన నెంతదూరము యశోవ్యాపారమంచన్న వ
హ్వారె! ఏమాత్రఁపుఁదవ్వుశత్రువిజయవ్యాహారమంచన్న న
ద్దిర! యేపాటిభరంబు పావనతరోద్దిష్టామృతోద్యద్భవ
త్కరుణాదృష్టి యొకింతసోకునెడ లెక్కా! భక్తసంరక్షకా॥

శా॥ఈనేత్రమ్ముల నీస్వరూపమునువీక్షించంగ నేవాఁడునేన్
పూనన్ వ్యర్థమనస్కుఁడై చనఁడొకో పూర్ణోరుబోధామృతం
బానందమ్ముగఁ ద్రావి నిత్యఘనదివ్యజ్ఞానదృష్టిం గనం
గా నాఁగాని గురుప్రభాకలితలక్ష్మ్యా! భక్తసంరక్షకా॥

మ॥ఇలఁ జండాలుఁడటంచుఁ బంచముని నెంతేపిల్తురేగాని స
త్కులజుండేసి, నరేంద్రుఁడేని సుగుణస్తోముండుగాకున్న ని
శ్చలభక్తిన్ గుణపంచముండనుచు వాస్తవ్యంబుగా నాతనిన్
బిలువన్ జెల్లదె! వాదముల్ విడచి యొడ్డేన్ భక్తసంరక్షకా॥

శా॥ నూఱేండ్లాయువు మానవాళి కజుఁడున్న్యాయమ్ముగా నిచ్చెనం
చార్యార్థిన్ ముదమందుచుండెదము కట్టా! అంతియేగాని నో
రారన్ నీభజనమ్ము సల్పుటకు రవ్వంతైనఁ గాలమ్ము లే
దే రోగాదులచే వృథాయగుటఁ దండ్రీ? భక్తసంరక్షకా॥

మ॥ ధనధాన్యాదివృథాభిలాషలకు డెందమ్మందునన్ గోరఁ గీ
ర్తిని లేశమ్ముయినన్ వహించఁగ ధరిత్రిన్ వేదశాస్త్రార్థసి
ద్ధినిఁ గాంచన్ నినుఁ బూజనల్ సలుప నెంతే నెప్డు నీపాదసే
వనముల్ మాత్రమొసంగి ప్రోవవలెనప్పా భక్తసంరక్షకా॥

శా॥ దానమ్ముల్ బొనరింపఁ గాసయినఁ జేతన్ దీయఁగాలేఁడు ప
క్కానీలో యొనరించి కోట్లయిన నెక్కుండైన వెచ్చించ నెం
తేనిన్ దా వెనుదీయఁగా దలఁపఁ డిట్టీరీతి దుష్టాత్ముఁ డ
జ్ఞానాంధుండయి కన్నుఁగానఁడుగదన్నా భక్తసంరక్షకా॥

మ॥ నిరుపేదల్ క్షుధచేఁ గృశింపుచిదె తండ్రీ మా మొరా
[లించి యొ
క్కరినైనన్ భుజియింపఁ బెట్టుఁడని యేకగ్రీవమే పార వే
డ రసాభాసపుఁ గూతలన్ గవిసి బల్ డంబమ్ము మైనుండు దు
ర్నరుఁ గోటీశ్వరు విందుసేయుఁ గరుఁడన్నా భక్తసంరక్షకా॥

మ॥ కలిమాయన్ బడి నాదినాదియని సంకల్పాదులన్ బుద్ధిఁ జొ
న్పి లవంబైన విచారణమ్మొనరుపన్ లేకే సదా కాలమున్
వలలోఁ జిక్కి దురాశలంచనెడి బంధమ్ముల్ బిగించంగ నె
ట్టులుఁ బోలేక నరుండు చింతిలుచునుండున్ భక్తసంరక్షకా॥

మ॥తనువుల్ శాశ్వతమంచు, భోగములు నిత్యమ్మంచు [సంసారవ
ర్తనముల్ నమ్మకమంచునమ్మి ఘననిర్వాణైక్యసంధానుభూ
తినిఁజెందన్ హృదయమ్ములోఁ దలఁపకెంతే? యెప్పుడున్ [ద్రోహాచిం
తనలన్ గాలముఁబుచ్చుఁజూచు నరుఁడన్నా! భక్తసంరక్షకా॥

మ॥తరుణీ రూపముఁదాల్చు పూరుషుని చందానన్ [బరబ్రహ్మసుం
దరమాయాకృతి నాత్మఁజుట్టి వెలుఁగొందన్ భేద [దృక్కాములౌ
పురుషుల్ మానసవీధినమ్మఁగ రెండ్పోల్కిన్ సదానందరూ
పరమాస్యమ్మెరుఁగంగ నేరికగుఁ జేవా! భక్తసంరక్షకా॥

శా॥లోకాతీతగుణాదికారణుఁడు సల్లోలుండయుండవ్యర్థబా
హ్యోకోపీనభవత్యటంచని మహోద్యత్ప్రీతి శిష్యాళికిన్
సాకల్యంబుగ జెప్పు సద్గురుఁడు లభ్యంబైన మోక్షంబుదాఁ
జేకూర్చన్ గలదాక్షిణ్యంబె పరదేశీ! భక్తసంరక్షకా॥

మ॥కలలోఁదోఁచు శరీరసంతతులు మేల్కాంచంగ నేలాగుఁదో
చులలేన్ సర్వము నావిధంబెయని సంశుద్ధాంతరంగప్రని
శ్చలతన్ సద్గురుపాదరేణువుల శీర్షంబందునన్ దాల్చి పెం
దలకాడన్ గడతేరసౌఖ్యముగదన్నా! భక్తసంరక్షకా॥

శా॥మూలాభావశరీరమిద్ది కనుమేమోచెప్పినానంచు నీ

వాలోచింపకు మీ శరీరములు శూన్యంబంతయున్ [సున్నయం
చీలోకానుభవంబు జెప్పఁగురుఁ డెట్టైనన్ దటస్థింప మి
ధ్యాలాపంబుల జిక్కనేటికి ? మహాత్మా! భక్తసంరక్షకా॥

మ॥ పరమార్థంబగు విద్య వేద, మదిసద్భావాత్మకంబౌను వే
దరహస్యమ్ముల భేదమార్గమను సంధాఫక్కి వీడంగఁ జే
సి రవంతైన నసత్యముం గనక వాసిన్ గూర్చు సద్విద్య త
త్త్వరహస్యమ్మది భావశూన్యము మహాత్మా! భక్తసంరక్షకా॥

శా॥ వాదంబుల్ పొనరింపఁ జిక్కవు మహాద్భవ్యప్రదోంకారస
న్నాదం బాలయమౌట నందవు సదానందాత్ములౌ వారికే
భేదంబుం గనుపట్ట వెన్నటికి నీవిశ్వంబునన్ మధ్యమాం
తాదుల్ లేక వెలుంగుచుండుటను దేవా! భక్తసంరక్షకా॥

మ॥ అమలంబై నిరవద్యమై ప్రకృతిమైయార్యానుగేయంబునై
భ్రమమూలంబయి పావనంబయి సదారాజత్కళాపూర్ణమై
సుమనోతీతగుణాకరంబయి మహాచ్ఛుద్ధంబునై బుద్ధమై
క్షమపై వెల్గెడు జ్యోతినీ వెకద యీశా! భక్తసంరక్షకా॥

శా॥ కామాదుల్ వెనుఁదన్ని పగ్గములులాగన్ మాయయున్ [వ్యాఘ్రము
ద్దామప్రక్రియ నడ్డగింపఁగ నితాంతానంతసంసారమున్
భీమాగ్నిప్రభ చుట్టుముట్ట హృదయాభిఖ్యంపురధ్యందు తా
నేమాడ్కిన్ నినుఁజేరి ముక్తిఁగను తండ్రీ! భక్తసంరక్షకా।

మ॥ అణువందట్టులె బ్రహ్మభావమున బ్రహ్మానందుగా నిత్యస
త్యనితాంతాశ్రయమూర్తివై వెలుఁగు భూతారాధ్య
[నిన్నెట్లు వ
ర్ణనముల్ జేయఁగ నేర్తురెవ్వరు పరార్థప్రాభవోపేత దృ
ష్టినిఁగాంచన్ గనవచ్చుఁగాని పరమేష్ఠీ! భక్తసారక్షకా॥

శా॥ ఆకాశంబున నైదు వాయువున నైదా తేజమం దైదు వ
స్తోకాపస్సుల నైదుఁ బృథ్వినయిదున్ దోడ్పాటచే నిర్వదై
దై కార్యమ్ములనూని భూతములు నాయాకారముల్
[శూన్యమై
యేకాలమ్మునఁదోచు మోక్షమదె తండ్రీ! భక్తసంరక్షకా॥

మ॥ పరికింపన్ సకలప్రపంచమున భోభావమ్ము సృష్ట్యాది చి
త్రరతుల్ మెర్పులు భోగభాగ్యములు కందమ్ముల్
[దురాశాదులు
దురవాతోద్ధతవర్షబిందువులు భీత్యుత్సాహముల్ పిడ్గు లే
సరణిన్ జెప్పినఁ జోటుచాలదఖిలేశా భక్తసంరక్షకా॥

మ॥ పరమోత్కృష్టగతిన్ జరించు నెరుకోత్పత్తిప్రదేశంబు గు
ర్తెరుఁగన్ వచ్చునటందురంట జనులుర్విన్ జిత్రమా దీపభా
స్వరమున్ మాపుతలంపునన్ జని నిరాశన్ జిక్కి రాలేకఁ జిం
దరవందైరి మృతిఁజెందవే మిడుతలన్నా భక్తసంరక్షకా॥

మ॥ గురువుల్ శిష్యులటంచుఁ గొందరు మహాగూఢప్రచా
[రమ్మునన్
బురముల్ పల్లెలుఁజొచ్చి భిక్షులని యేమో పేరులన్ బెట్టి స

త్వరతన్ డాంబికమైనవృత్తి ధనమున్ బాగొప్పఁగాఁ [గూర్చి యెం
దరినో మోసముబుచ్చుచుందురు గదా నన్నా భక్తసంరక్షకా॥

మ॥ గురినిల్పన్ బొనరించువాఁడె గురువౌఁ గోట్లాదిసామ్మున్ నిరం
తరమున్ శిష్యుల నేడిపించికొను మందప్రాభవుండౌనె త
ద్గురువాహాలఘువన్నఁ జెల్లదొకొ సంకోచమ్ముఁ బూనంగనే
ల రమానాయికహృత్పయోంబురుహ ఖేలా భక్తసంరక్షకా॥

మ॥ నిరవద్యప్రజితారివర్గుఁడు ల సంన్నిమ్న స్వభావుండు బం
ధురమోక్షప్రమదావశంకరుఁడు విద్యుచ్ఛిత్ప్రభుండైన స
ద్గురుసామ్రాజ్యకటాక్ష వీక్షణలు చేకూరంగ శోకాదులన్
దరియింపన్ దొరకొంటఁగష్టతరమా నా! భక్తసంరక్షకా॥

మ॥ ముదమున్ దుఃఖము సౌఖ్యకష్టములునున్ బూర్ణాను [భోగాది సం
పదదారిద్ర్యములున్ బొఁగడ్త్రదపలున్ వైమమ్యసత్స్నే [హమున్
మదిదుల్యంబులెకాని భేదమనియేమాత్రంబునేన్ జూడ న
ట్టి దయామూర్తి జగద్గురుండుగద తండ్రీ భక్తసంరక్షకా॥

మీమాంసాది సమస్తశాస్త్రముల నెమ్మిన్ జూచినన్ గాని తా
నేమాడ్కిన్ గడ తేరఁగావలయు నో? యేలాగొ? యే [శాస్త్రమం
దేమూలన్ గనుపించదిన్నిటికి మోక్షేచ్ఛానుబంధాత్ములన్
నీమంబొది రహస్యమూలమది తండ్రీ భక్తసంరక్షకా॥

మ॥ గురువన్నన్ జగదంధకారవిలసత్కోట్యర్కసందీప్తుఁడై
మెరయన్ గావలెఁ జిల్లిగవ్వయయినన్ మేకొంచు [యాచించు దు
ష్కరరాగాంచితుఁడెట్లు తా గురువొ? యాశాకూపసంవాసినా
బరఁగన్ గాక యతండు నిక్కముగ దేవా భక్తసంరక్షకా॥

మ॥ లలితశిష్యావళిభిక్షులన్ సలుపు వేళన్ గారణాచార్యుఁడెం
గిలి కూడింత భుజింపఁ జేయునట సంకేతప్రవృత్త్యాత్మ లీ
కలికాలంబున నెట్లు వెల్వడిరి? వేడ్కన్ డాంబికాచార్యులం
చలవారిన్ బిలువంగఁ జెల్లును గదన్నా భక్తసంరక్షకా॥

మ॥ ధర నెచ్చోఁ గనుఁగొంద మంచనిన వేదాంతజ్ఞులేయన్న ప
ల్కరహీనర్ రిత్తయె? దేవునానమును నేలోకమ్మునం దెందొ సు
స్థిరకీర్త్యాన్వితుఁడౌ కవీంద్రుఁడిపుడోంచింతింప నింటింట న
ల్పరకున్ మిక్కుటమైరి నావినమె యొప్పున్ భక్తసంరక్షకా॥

మ॥ ధరపై నింగువ పెట్టె నీరమున భేద్యంబౌనటుల్ రుద్దినన్
స్థిరవృత్తిన్ నివసించు వాసనది సూక్ష్మీభూతమైయుండున
ట్లురుసద్దేశికు బోధగాంచినను నంతోయింతో యజ్ఞానమే
నరునేన్ వీడకనుండు నిక్కముగదన్నా భక్తసంరక్షకా॥

నాయన్ వాక్యముతోడనే జగములన్నన్ సృష్టులన్నన్ లస
న్న్యాయాన్యాయములన్న వర్తిలెడు నానా యొప్పుసార్థక్యమా
న్నో యావేళనె పూర్ణభావముగు నెందన్ భేదశూన్యంబు నా
నా యాచిత్రము నేరెరుంగుదురు దేవా! భక్తసంరక్షకా॥

శా॥ సారాచారవివేకవంతుఁడయి సంసారేచ్ఛలన్ మాని ని

స్వారానందపదార్ధ భోగరచనా సామర్థ్యుఁడై సద్గురో
కారో నిర్గుణరూపకో౽జ యనం గానొప్పు మంత్రంబు ని
త్యారూఢిన్ జపియించువానికిక లోటా భక్తసంరక్షకా॥

శా॥ నీతివ్యాకృతులన్ గ్రహించి సుగుణానీకంబులార్జించి దు
ర్నీతాళిన్ నిరసించి యాచరణుఁడై నిర్నిద్రతాయోగ వి
ఖ్యాతిన్ గాంచిన రాజయోగికిక సాధ్యాసాధ్యముల్ గల్గునే
యేతీరున్ గననట్టిజన్మ సఫలంబే భక్తసంరక్షకా॥

భూమిన్ బూరుషుఁడన్న నింద్రియజయాభ్యుత్సాహ [నిర్మాల్యుఁడే
యామాయాయువతీమణీ నిరతుఁడౌ నా పూరుషుండన్న బ్ర
హ్మమోఘప్రభవాభిరామ మగు విద్యన్ విద్యనాఁ జెల్లఁగా
కామార్థుల్ లిఖియించు వ్రాళ్ల గునె విద్యల్ భక్తసంరక్షకా॥

మ॥ తనుఁదానెప్డు గ్రహించఁగాఁదలచునో తానప్డే మిధ్యయై
కనుపించుఁ గననున్న మార్గమదియున్ గాన్పించుఁదానంత బ్ర
హ్మనిరూఢిన్ సగురూపదేశమున సమ్యగ్బోధనా పద్ధతిన్
గనువాడే పరవాసుఁడై పరగు నన్నా భక్తసంరక్షకా॥

మ॥ గురువాక్యంబును నావనెక్కి యహమన్ కూపారమున్ [దాటి బం
ధురసోహంబను వాక్సుధన్ మెసవి సంతోషప్రమత్తోరుచి
త్తరసేజుండయి శాంతియన్ గులిశశంస్త్రాలంకృతిన్ గాంచి మో
క్షరమన్ బెండిలియాడువాడె నరుఁడీశా భక్తసంరక్షకా॥

నడురేయిన్ వడిలేచి స్నాతుఁడయి సంధ్యన్ దీర్చిభస్మాంగుఁడై

కడుయోగాదినిరూఢుఁడంచనుకొనం♦గా నాసికన్ మూసి ప
ల్కఁడెవండెంతగఁ బిల్చినన్ నయనయు♦గ్మంబైనఁ జక్కంగమూ
యఁడుద్రవ్యార్జనకై దురాత్ముఁడిల దే♦వా! భక్తసంరక్షకా॥

మ॥ పరుపుల్ దిండ్లుఁ దివాచి బాలిసులు న♦వ్వార్ పట్టె [మంచంబులున్
బరివారంబులునుండ మండిపడు ముం♦డాయింద్రియవ్యాపకం
బు రవంతైనను లేక నీల్గునది యేం♦మో! బుద్ధికిన్ దోఁచిన
ట్లెరుఁగన్ లేక వచింపఁ జిక్కుఁడొకో! తం♦డ్రీ! భక్తసంరక్షకా॥

శా॥ కాసున్ వీసముగాని విద్యలివి లెం♦క్కా? చూడఁగా [బ్రహ్మవి
ద్యాసామ్రాజ్యముతోడ సాటియననా♦నా! తేనెలన్ ద్రావన
భ్యాసంబౌ మధుపంబు క్షౌరజలపా♦నాపేక్షచేఁ బోయి యే
వాసిన్ ద్రిమ్మరునట్లు సజ్జనుఁడు దే♦వా! భక్తసంరక్షకా॥

శా॥ అంగంబుల్ గడుఁ బెంచి సేలువల నొ♦య్యారంబునన్ [దాల్చి యే
నుంగున్ బోలు మెడన్ గదల్చుటకు స♦న్న్యాసాశ్రమంబొంది దు
స్సాంగత్యంబున నిట్టులయ్యెనని నీ♦చప్రాయుఁడిట్టుల్ కృశిం
చుంగా నెట్టులనిన్ స్మరించి యిల ని♦ల్చున్ భక్తసంరక్షకా॥

శా॥ నీరంబందు వెలుంగు నుష్ణక్రియ సం♦దీప్తాగ్నిలో వెల్గు క
ర్పూరంబన్నటు లా గురూత్తముని సం♦ద్రూపప్రకాశమ్మునన్
సారూప్యైక్యపథంబు నందవలె శి♦ష్యశ్రేష్ఠుఁ డట్లందఁ సం
సారాబ్ధిన్ దరియించు టెంతపని యీ♦శా భక్తసంరక్షకా॥

మ॥ గురురాయందు లభింపనేమికొలఁ! చింక్కాల్ దీరు
[సంసారదు
ర్భరపాథోధికి నీనిజాత్మకును సంబంధమ్ములేకుండుఁ గు
మ్మరపుర్వన్ బురదంటనట్టులును సమ్యగ్భానుదీప్తిన్
[మహో
త్కరమౌ చీకటియంటనట్టులనఁశేందా! భక్తసంరక్షకా॥

మ॥ ధరణీ దిగ్గగనాబ్జసూర్యఘనభూభ్రద్ప్రాథ్యముల్
[క్రుంగినన్
స్థిరమై యెవ్వరికందరానిదయి సుశ్రీయుక్తమై దివ్యమై
యెరుకన్మించినదై వెలుంగు నదెయొం తేన్ నాశమున్ జెంద ద
క్షరమౌ పూర్ణముగాన శాశ్వతమి లేంశా భక్తసంరక్షకా॥

శా॥ ఆధారంబులకాదిమూలము సదధ్యారోపవాదాస్పద
ప్రాధాన్యంబు విరాట్స్వరాట్పరసుసంబంధంబు యోగాదివి
ద్యాధారేయము సర్వదేవనిచయవ్యామోహ సర్వేశ స
ద్బోధప్రక్రియఁగాంచశక్యమ ఆదేమో! భక్తసంరక్షకా॥

శా॥ నోటన్ జెప్పట కేదితోచదు మరెన్నోయుక్తులన్
[బన్ని వా
చాటంబొప్పనయింప పిల్లలుఁగ దుచ్ఛల్ నీచముల్ లేక నే
చోటన్ జూచిననుండుఁ గన్పడదు ప్రాచుర్యంపు సత్తేజమౌ
టాటోటుల్ గురిలేకఁగాంచుటెటు కట్టా! భక్తసంరక్షకా॥

మ॥ భయమున్ భక్తియు వందనార్చనములున్ వైరాగ్య
[కామాదిని

శ్చయమున్ వర్ణవిభేదశూన్యమును విశ్వాసమ్మునైక్యమ్ము స
న్నియమంబుఁ సుమనఃప్రవృత్తిగల యేధీరుండు గుర్వాజ్ఞన
క్షయుఁడౌ నాతఁడె శిష్యుఁడంచనిన నీశా భక్తసంరక్షకా॥

మ॥ జగదుత్పత్తికిఁ గారణుండగుచు మనస్సాక్షిన్ జిదానంద భా
సగుణుండన్ ననుమించిలోకమున నేచాయన్ విలోకించినన్
విగుణంబై కనుపించుఁగాని మరి దేవిన్ జూడఁగారాదటం
చగడున్ జెందకఁజూడ జ్ఞానియగుఁ డన్నా భక్తసంరక్షకా॥

మ॥ కరితామ్రింగిన వెల్గపండుక్రియ దుర్గాధప్రకృత్యాది వి
స్తరసంకల్పములన్ విడంగవలె శశ్వన్నారికేళాంతర
స్థరసంబన్నటులా గురూత్తముఁడు బోధన్ జ్ఞానమున్ శిష్యుడున్
బరమాసక్తినిఁ గాంచఁగావలెను దేవా! భక్తసంరక్షకా॥

శా॥ త్రాటిన్ద్రొక్కియధార్థసర్పమను దుర్భ్రాంతిన్ [మహాభీతుఁడై
నోటన్ మాటలులేకఁ గ్రిందఁబడి మందుల్ మ్రాకులన్ [ద్రావి మా
యాటోపమ్మునువీడి లేచుక్రియ నాత్మానాత్మలఁ గాంచి వా
రీటాటోటుల గోటమీటరొకొ తండ్రీ భక్తసంరక్షకా॥

ధనముం గోట్లకొలందిఁ గూర్చితి నమందప్రజ్ఞుఁడన్ నేనటం
చనిగర్వించి ధరాంతరిక్షముల మధ్యన్ నన్ను గెల్వంగ నే
రును రాజాలరటంచుఁ గ్రొవ్వి నను నాయూర్థిఁ విలోకింపరా
ధనమేవారికి బంధకారణము గాదా భక్తసంరక్షకా॥

శా॥ ఏనే సర్వకలాప్రవీణుఁడను నన్నీలోకమం దెవ్వ ర
న్యూనప్రాభవ వైదుషీగరిమ యందున్ మించలేరంచు న
జ్ఞానాంధోత్కరబుద్ధిఁ బల్కు జడుఁడా సర్వజ్ఞుఁడీమాయ కే
దోనాళంబు వచింపఁగాఁగలుఁగు నో భక్తసంరక్షకా॥

శా॥ సంపత్పూరుషుఁడన్న సద్గురుపదాబ్జానందపూర్ణోరు ధీ
సంపన్నుండు శమాదిషట్కయుత శశ్వత్సంపదాన్వీతుఁడున్
సంపత్పూరుషులంద్రుగాక శతలక్షుల్ న్యర్బుదాల్
[రూప్యముల్
నింపన్ వాడగునే ధనాఢ్యుఁడిల నెందేన్ భక్తసంరక్షకా॥

శా॥ పాట్లన్ బోసికొనంగఁ గైతలని యేవో పిచ్చి
[పద్యంబులన్
మట్టున్ మేరయు లేక నే కుమతినో బ్రహ్మాండభాండుండటం
చట్టిట్టంచు నుతించి చెప్పుటది కట్టా! హాస్యమూలంబె కా
యెట్టుల్ మోక్షపథంబుఁ గుర్తెరుఁగనారే భక్తసంరక్షకా॥

మ॥ కవినా యెట్టిడొ! కావ్యమెట్టిదియొ! వాక్యార్థాను
[రీతిన్ విమ
ర్శవిధిన్ జూచినఁ గేవలాత్మవిదుఁడే రాజత్కవీంద్రుండనం.
గ వెలుంగున్ మరి కావ్యమన్న కవిసంకల్పమ్మె
[కావ్యమ్మగున్
భువిఁ దక్కుంగలవారలే కవులు శంభో! భక్తసంరక్షకా॥

మ॥ తనలోఁ దానిక నెవ్వఁడేని ధనవిద్యాధాన్యగోభూములన్
ననుమించంగల వాఁడొకండు గలఁడే నారాయణ ప్రార్చితే

చ్ఛనెవండో యొకఁడుండినన్ బ్రదికిపోశక్తుండెనా ముందటం
చని దుర్మార్గుఁడు యోచనల్ సలుపునన్నా భక్తసంరక్షకా॥

శా॥ నా క్రిందన్ బదిమంది యోధజనులున్నా రందరే కాలమం
దే కార్యంబొనరింపఁగాఁ బనుచునో యేమేమొ యంచాజ్ఞకై
దూకుల్ వెట్టుచునుందు రేమి కొఱ! సాధుస్తోమ గేహమ్ములన్
వీకన్ ద్రోయుఁడటంచుఁ జోరుఁడను తండ్రీ! భక్తసంరక్షకా॥

శా॥ ఏనీ యైహికసౌఖ్యముల్ విడిచితంచేపండ్లో! యేకాయలో
జానొందన్ భుజియించి యొంటరిగ భక్ష్యాల్ పాయసాల్
[మెక్కి సు
జ్ఞానేచ్ఛన్ జరియించుచుంటినని చంకల్ గొట్టి చాటంగ వా
డౌనా నిర్జితదుర్దశేంద్రియుఁడు దేవా భక్తసంరక్షకా॥

మ॥ సరివారందరు నవ్వుచుండినను విశ్వాసమ్మునన్ జుట్టలం
దరుఁ జీకొట్టుచునుండినన్ హితులు స్వాతంత్ర్యమ్మునన్ గార్ధభో
త్కరమాయంచసి పిల్చుచుండిన మహోత్కంఠన్
మదాంధుండు స
త్వరతిన్ గ్రుమ్మరిలంగఁబోవఁడు గదన్నా! భక్తసంరక్షకా॥

మ॥ పరులేరైనను శాస్త్రముల్ జదువ నోర్వన్ లేదు తా నేర్వలే
డరయన్ దప్పును నొప్పునేని యెఱుగండా మాత్రపున్ జ్ఞాని వే
దరహాస్యమ్ములు గీతలున్ జదివి తత్త్వార్థమ్ములన్ జెప్ప నెం
దరినో కూర్చి వృథా ప్రగల్భుఁడిల నన్నా భక్తసంరక్షకా॥

పురుషుండెట్లు తరింపగావలయునో పూర్వుల్ విచారించి యా
సరణుల్ వ్రాసిరి శాస్త్రనామముల నాచారమ్ములంచవ్వి యం

దరకాధారములయ్యె వాటివిడి క్రొత్తల్ క్రొత్తలన్ నేర్వగా
దొరకొంటల్ గడు హాస్యకారణము లెందున్ భక్తసంరక్షకా।

శా॥ నీతిన్ నోటవచించ నేమిఫలమా నీతిప్రకారమ్ము వి
ఖ్యాతిన్ జెందగ నాచరించవలెఁదా నాపైవచించన్ వలెన్
జేతోమోదమెసంగజేయవలె సచ్చిత్సౌఖ్యభోగాత్ములా
కూతల్ నమ్మెదరెట్లు నీచుఁడటు బల్కన్ భక్తసంరక్షకా।

పరమేశుండు కృపాతిరేకమున వాక్పాణ్యక్షిపత్కర్ణముల్
నరలోకమ్మున కేలనిచ్చెనొకొ సానందమ్ముగానిన్ నుతిం
పరహిన్ వందనమాచరింపఁగన బోవన్ బూజలన్ సల్ప స
త్యరతిన్ సత్కథలాలకింప నిదిరిత్తా భక్తసంరక్షకా॥

కారుల్ ప్రేలుచు బీదవారిఁ గని బింకాల్ గొట్టుచేనాఁడుఁ గృ
ష్ణారామాయను పాపమున్ గనక నిత్యంబైన సంసారమా
ధారమ్మంచని మాటిమాటికి నమందప్రజ్ఞఁ బల్కన్ దురా
చారుండెట్టుల ముక్తినొందునతఁడీశా భక్తసంరక్షకా॥

మ॥ మలమున్ ముట్టియనంతరమ్ము గడుగన్ బ్రాల్మాలి [యుండంగ దు
ర్మలగంధంబెటువీచుచుండు నటులే బ్రహ్మస్వరూపంబునన్
గలుగన్ దోభ్రమమైచరించు నటుపై నానావికారంపుఁజే
ష్టలునున్ బుట్టు నశించుబోధగన నీశా భక్తసంరక్షకా॥

మ॥ అనృతంబన్నఁ దృణాభమై నిజమనన్ హాస్యాస్పదంబై లస
ద్ఘనమన్నన్ లఘువై పరాత్పరుని నిత్యానందుసద్భక్తి పూ
జనలన్నన్ గలలంటివై పరగు విశ్వంబందుఁ బల్మారు దే

పుని సాక్ష్యంబుగఁదీసికోఁజనునె యెప్డుఁ భక్తసంరక్షకా॥

శా॥ ఘోరంబిద్ది యఘోరమిద్దియని యేకోశంబునన్ గాని త
త్త్వార్థిన్ గనఁబోక సామ్మనిన జీవమ్మీఁదియంగ సం
చారంబుల్ బొనరించుచుందురు దురాశాబద్ధులెల్లప్పుడున్
వారెవ్వారికి వశ్యులౌదురొ గదన్నా భక్తసంరక్షకా॥

మ॥ పరనారీమణులన్ గనుంగొనిన సద్భావమ్మునన్ దల్లిగా
బరవిత్తమ్ములఁ జూచినన్ విషముగాభావించి యెవ్వాఁడు స
త్యరతిన్ సంచరణంబుసేయు నతఁడే తద్విశ్వసౌఖ్యాదులన్
మారచున్ మర్వఁడు మర్వరానిది మహాత్మా భక్తసంరక్షకా॥

మ॥ మనజ్ఞానంబనురత్నముం బడయ గామక్రోధలోభాదిశ
త్రునరుల్ నిత్యముబొంచియుందురదియొందన్ గానరాకుండ స
త్యనిరూఢంబగు పేటికందిడిగురో త్త్రాసున్ దయారూప బం
ధనమున్ జేసిన నేరికిన్ దొరుక దన్నా భక్తసంరక్షకా॥

శా॥ త్రాగుంబోతులు మాంసభక్షకులు దుర్మార్గప్రచా
[రాత్మకుల్
బాగొంగించక నెట్టినీచమయినన్ బాల్మాలిసేతుర్ మహా
భాగుల్ కూడదటన్నఁ జోరరతిఁ గొంపల్ దోతు రవ్వారికే
లాగో మోక్షపథంబు చిక్కుటలు కొల్లా! భక్తసంరక్షకా॥

మ॥ అరువన్ గొంతులు గోయువాఁ డొకఁడు బ్రాహ్మణ్యం
[బన్నచో నెంతయుం
చు రహిన్ హాస్యమొనర్చు వాఁడొకఁడు సంశుద్ధాత్మలన్
[జెండిరాఁ

గరమార్గంబున బోనరించు వాఁడొకఁడు లోకమ్మందునీరీతి దు
ర్నరులెప్డుం శతుఁగొల్చుచుందురుగదన్నా! భక్తసంరక్షకా॥

శా॥ తా నెచ్చోటవసించినన్ జనులు మందల్ మందలై
[చుట్టు న
త్యానందంబునఁ గూరుచుండఁ గని వింతల్ దోచు డంబాలనె
న్నేనిన్ గొట్టుచు నాలకింపుమను చెంతేటక్కులన్ గాలమి
ట్లీనాడెంబునఁబుచ్చు దుర్జనుఁడు తండ్రీ! భక్తసంరక్షకా॥

జలమందుద్భవమౌను బుద్బుదములేచాయన్ విడంబించు నె
ట్లు లయంబొందు నటే చిదాకృతులు వెల్గున్ నాశనంబందు ను
జ్జ్వల ప్రాపంచికవృత్తులందున రహస్యంబైన యీబోధ ని
శ్చలుఁడౌ దేశికుడే యొసంగవలె నీశా భక్తసంరక్షకా॥

శా॥ మోక్షేచ్ఛన్ జరియించువారి కఖిలంబున్ జీమూదో
[మాదులా
ధ్యక్షబ్రహ్మపరీత జీవచయముల్ తారాగణమ్మౌఁగా మహా
నిక్షేపంబులఁగాంచువాఁడెపుఁడు నెందేన్ జిల్లి వక్కేనిఁ దా
భిక్షుత్వంబునఁ దేఁగడంగునొకొ! యుర్విన్ భక్తసంరక్షకా॥

మ॥ మును నాతాతలవంటివారెచని రిష్టో పోవుచున్నారు పో
వను యత్నించుచునున్నవారు మనమీబ్రహ్మాండ
[భాండంబునం
దున లెక్కా! యని యోజనన్ సలిపి సాధూనాంపథం
[పత్సుఖం
బను వాక్యంబుఁదలంప మేలగుఁగదన్నా! భక్తసంరక్షకా॥

మ॥ ఘనమౌ ధర్మమహింసకంటెఁ గలదా కట్టా! [విచారించిచూ
చినఁ దానెట్టులొ! యన్యజీవములొగిన్ జిత్తంబునందట్టులే
యని భావించి యజాదిభూతముల నన్యాయమ్ముగాఁ జంపకుం
డిన వాఁడే గద ధర్మమూర్తుఁడనఁ దండ్రీ! భక్తసంరక్షకా॥

మ॥ అనయంబున్ దనతోడివారని మహాహ్లాదమ్మునన్ [జూచి లో
కనికాయమ్మును సాత్తబంధుఁడయి యేకర్మిష్ఠి వెల్గొందు నా
తనిదే జన్మయటంచుఁ జెప్పవగు నందల్ వేలుదుష్టుండు ఛీ
యని దూషించఁగ నిక్కువాని దొకజన్మా! భక్తసంరక్షకా॥

మ॥ జననంబొతరి నీవికారగుణచేష్టల్ గూడ నీతోడఁబు
ట్టెన! అట్లే మదిలోఁ దరంగములమాడ్కిన్ బుట్టి [పెంపొందుచుం
డి నశించున్ వివిధాశయమ్ములను పూన్కిన్ సాధు [బృందమ్ములన్
గని హాస్యమ్మొనరింపఁడే సుజనుడన్నా! భక్తసంరక్షకా॥

మ॥ స్థిర గోపాలునివంశసంభవుఁడ శ్రీశ్రీరామశాస్త్ర్యాత్మజుం
డ రసాదేవకులుండఁ బండితజనానందానుసంధాన త
త్పరతాసక్తుఁడ మోక్షసాధనవచోధన్యుండ హన్మంతరా
డ్వరనామాంకుఁడ దీని వ్రాసితిని దేవా! భక్తసంరక్షకా॥

ఫలశ్రుతి.

శా॥ ఈపాత్తంబును మూడుకాలముల నెంతే భక్తితోఁ [బాడినన్
బాపంబుల్ తొలగుర్ లిఖించునెడ శశ్వత్పూతుఁడౌ విన్నచో
నాపత్సంచయమారిపోవు నుడుచంద్రార్కస్థమై యొప్పఁగా
నీపాదమ్ముల కంకితంబిడితిఁ దంఢ్రీ! భక్తసంరక్షకా॥

గద్య.

ఇయ్యది

శ్రీ గుంటూరు జిల్లా వినుకొండతాలూకా ముప్పాళ్ళ గ్రామ నివాసులును, సంస్కృతాంధ్రపాండితీధురంధరాగ్రేసరులును ఆరువేలనియోగి బ్రాహ్మణవంశసంభవులును, మౌద్గల్యస గోత్రపవిత్రులును అగు గోపాలుని శ్రీరామశాస్త్రి గారి తనూజుఁడగు హనుమంతరాయశాస్త్రిచే వ్రాయఁబడిన భక్తసంరక్షక శతకము అను నామాంతరముగల సుమనసోల్లాసము సర్వ ము శ్రీ భగవానున కంకితముగా సంపూర్ణము.

ఓం తత్సత్.

విజయ శేత రామ్.

ముప్పాళ్ళ,
12-9-24.

ఇత్థం విద్వద్విధేయపరమాణుః,
గోపాలుని హనుమంతరాయశాస్త్రి.

